కుదోఁ్బధించి సిస్తు వసూలుగాకుండునట్లు చేయుఁడని పంపెను. ఆ చారులును భద్రాద్రికివచ్చి మారువేసములతోఁ జరించుచు రామదాసు రామాలయము నిర్మింపించుసమయమున హితులవలె వచ్చి ఖజానాలోని సొమ్మును బ్రస్తుతము వ్యయముచేసి పర్యాయమునఁ జందాలమూలకముగా మఱల బొక్కసము నింపవచ్చునని గఱపి యట్లుచేయించి యీసమాచారమును వెంటనే సితారా కెఱింగించిరి

'పిట్ట చిక్కెనని సితారా సంతసించి యీ వేగులవాండ్రకుఁ బారితోషికములఁ బంపి' యిబ్రహీమును రప్పించి దాసు సిస్తును వ్యయముచేయుచున్నాఁడు. నవాబుగారు మఱల మీవలన వసూలుచేయింపుమా యని రైతుల భయపెట్టి సిస్తు వసూలు గాకుండునట్లు గ్రామములలోఁ బ్రచారము సాగించి నవాబు గారిని రామదాసు ధిక్కరించు చున్నాఁడని మహాజరుల నంపునట్లు చేయవలసినదని చెప్పిపంపి యతండు పోవుచుండ మఱలం బిలిచి ఓయీ! ఉక్కు తునియలవంటి మోఱకులంబంపి భద్రాద్రి ఖజానాను గొల్లగొట్టించుము. మఱవకుము. ఈ హిందువులకు సింహాస్వప్నముల మయ్యేదముగాక యనిచెప్పి సెలవిచ్చి పంపెను.

అంత నొకనాఁడు మాదన్నగారు లెక్కలు తనిఖీచేసి భద్రాద్రి పైకము రాలేదని యెఱింగి వెంటనే విశ్వాసపాత్రులగు గూఢ చారులం జీరి "నవాబుగారు భద్రాద్రితాలూకా పైకము రాలేదని కోపించుచున్నారు. కాన నీవు వెంటనే సొమ్ము వసూలు

చేసి పంపవలయును. లేకున్నఁ గీడుమూడును. నీ యభ్యుదయ మునకు భంగముగల్గింపం గొందఱు గోముఖ వ్యాఘ్రము లున్నారని యెఱింగి జాగరూకుఁడవై కనుగలిగి మెలఁగవల యునుసుమా! అని గోపన్నకుఁ జెప్పఁబంపినాఁడు. తా నా మాటల గూఢచారులవలన విని కానిమ్ము "భవితవ్యతాబల వతీ" కాఁగలది కాకపోదు. అంతకు శ్రీరామచంద్రమూర్తియే కలండని యా చారుల నంపివేసి రామదాసు కంకణము గట్టుకొని శ్రీరామ కల్యాణ మహోత్సవాలోకనానందసముద్రమున మునిఁగియుండ నానాటి నడిరేయి యిబ్రహీమ్ పంపిన దొంగల గుంపులు ఖజానాతలుపులు బ్రద్దలుగొట్టి లక్షయేఁబదివేల పైకమును హరించిరి. తెల్లవాఱినది. ఎల్లవారి మోములతోఁ బాటు దాసు మోమును దెల్లవాఱినది నేను రామునింటిలో దొంగలదోఁపు చేయించెదనని రాముఁడే ముందుగా నా యిం టిలో దొంగలదోఁపు చేయించినాఁడు కావలయు. కాని మ్మంతకు నతండే యున్నాఁడని తలంచి దాసు నిశ్చింతుఁడై యున్నాఁడు.

మఱునాఁడే రామదాసు తమ ధనమును వ్యయముచేసి దేవా లయముం గట్టించినాఁడు. మేము సిస్తు నిచ్చుటకే భయపడు చున్నాము. తమ యానతిం ద్రోసిపుచ్చు రామదాసువలన మీ రాజ్యమునకు మీకు నపాయము రాఁ గలదు. మీరు వెంటనే విచారించిన సర్వముం దెలియఁగలదు. అను నర్థము గల మహజరులు కొన్ని గ్రామములనుండి తానీషాకు వచ్చి చేర నతండు పరికించి నా ధనము ధర్మకార్యములకేగదా విని

మనకు హిందువులకుఁ బోలిక యెక్కడిది? పొత్తెక్కడిది? ఏమండీ—వినుఁడు.

అవకాశము దొరకినం జాలు నిదియంతయు హిందూ రాజ్యమగును. అగుటకుఁ బ్రయత్నములును జరుగుచున్నవి. అకటా! ఒక్క తహశీల్దారుని మీ రణఁచలేకున్న—కాదొక్క హిందువునుగూడ మీయాజ్ఞలో మెలఁపకున్న—ఇఁక మాటలెందుకులే ప్రభూ! నాకంటె హితము గోరువారు మీకుఁ గలరా? మీ క్షేమముగోరి చెప్పుచున్నదానను. వినుఁడు. నా నిశ్చితాభిప్రాయము వినుఁడు. ఏమైనఁ గానిమ్ము ఆ కాఫరును మీరు వెంటనే పట్టి తెప్పించి తల నఱకింపవలయును. ఒక్క హిందువును మీ రీపనిచేసిన నింక నెవ్వఁడును రాజద్రోహమునకుఁ బాల్పడఁడు. నమ్ముఁడని సివమెత్తి పలుకుచున్న యాగయ్యాళినిఁజూచి తానీషా నవ్వుచు ప్యారీ! బేగం! నీ స్వమతాభిమానమునకు సంతసము, పరనిందకు దుఃఖము కలుగుచున్నది. హిందువుల నేల సంశయించెదవు. ఏటికి దూషించెదవు. అన్నిమతములవారిలోను శిష్టులు దుష్టులు నుందురు. మన మతస్థుఁడైనను నౌరంగజేబు మీ తండ్రి నబ్దుల్లా హుసేన్ కుతుబ్ షాహాగారిని షియాపంథ నవలంబించెనని యెన్ని విధములఁ బీడింపలేదు మీర్ జుమ్లా సంగతి నీవే చెప్పితివి. అది యట్లుండె. మీతాతగారు మహమ్మద్ కులీకుతుబ్ షాహాగారు ప్రతివత్సరము 60 వేల హూనుల హైందవుఁడని, మహమ్మదీయుఁడని తలఁపక పేదతనము మాత్రము చూచి పంచిపెట్టెడివారే. వారు లోకోపకార

ములకై 78 లక్షల హోనుల వెచ్చించిరే. వారి యల్లుఁడనైన నేనేమి వెచ్చించితిని. మఱియు వారా ధనము నొక్క స్వజాతికి మాత్రమే కాదుకదా వినియోగించినది.

మీ తాతతండ్రిగా రగు "ఇబ్రహీం కుతుబ్ షాహా" గారిని హైందవుఁ డగురామరాయలు పుత్రకల్పునిగాఁ బోషింపలేదా? ఆ యిబ్రహీంగారు మురారిరావును ముఖ్యమంత్రిగాఁ జేసికొనలేదా? ఆ మంత్రి దక్షిణ దేశములోని హైందవ దేవాలయముల దోచుకొని వచ్చినందులకుఁ గదా నవాబుగారు మిక్కిలి చింతించి కృశించి యానగపుత్రోడనే మరణించిరి. ఆయన స్వపరజాతిభేదము కలిగియుండెనా? ఆయన కెందఱు తెలుఁగు కవులు మిత్రులుగా నుండిరో యెఱుఁగుదువా? ఆయన తెలుఁగు నెంత యాదరించెనో తెలిసికొంటివా? అద్దంకి గంగాధర కవిచేఁ 'దపతీసంవరణ' మను కావ్యమును కూడఁ గృతి నందిన యా నవాబుగారి గుణగణము నేమని కొండాడఁ గలము.

ప్యారీ! జాతి ద్వేషము కూడదు. తప్పు చేసినచో నే మత స్థుఁడేని దండ్యుఁడే మాదనామాత్యశేఖరుని నీ వనుమానింపకుము. ఆయన తెలివితేటల వలననే మన రాజ్యము నిలిచియున్న దని గ్రహింపుము. లేనిచో నెప్పుడో మహారాష్ట్ర వీరులచేఁ బడియుండెడిదే. లేదా ఔరంగజేబు కాఁ జేసెడి వాఁడే.

బేగం! నీవు చెప్పు. ఔరంగజేబు సైన్యములు మన గోల కొండను ముట్టడించినపు డెన్నిసారు లక్కన్న మాదన్నలు వానిం బాఱఁదోలి యుండలేదు. స్వజాతి వాఁడైన యిబ్ర హీమును నమ్మికొని యున్నచో నిప్పటి కెక్కడ నుండెడి వారమో? నెమ్మదిగా నాలోచించుకొనుము. మాదన్న గారి బుద్ధికుశలత వలనఁ జమీా ఫ్రెంచి, యింగ్లీషువారు మన యాజ్ఞలకు వేచియున్నది. అక్కన్న మాదన్నగార్ల విష యమై నీవొక్క దోసమైనఁ జూపఁ గలవా? హైందవుఁడని గోపన్న నేరము నణఁచియుంచె ననవత్తువేమో? నిన్న నే లెక్కలు పరీక్షించి భద్రాచలము తాలూకా పైకము మాత్రము రాలేదనియు హుకుము పంపితి మనియు మాదన్న గారు నీకంటె ముందే చెప్పియుండిరి. అసలు వారు బయటఁ బెట్టిన గదా నీకును దెలిసినది. లేకున్న మన మెట్లు తెలిసికొనఁ గలము. అనుచుండ సితారా చివాలున లేచి మీా రాజ్య వ్యవహారముల జోలి నాకేల? ఆదియునుఁగాక ఆడదాని కేమి తెలియును. మీా యిష్టము వచ్చినట్లు చేసికొనుఁడు. నాకు శిరోవేదనగా నున్నది అని విలాసముగాఁ జేతులు త్రిప్పుచు మోము నోఱగా వంచి యొక క్రేగంటి చూపు విభునిపైఁ బాఱవైచి దూరముగాఁ బోవుచుండగాఁ నాయొయ్యా రమునకు నా నడకల తీరునకు నా చుఱుకుఁ జూపుల యేపు నకు నోపలేక మదనోద్రేకము తలకెక్కి యున్న తానీషా వెంటనే లేచి యొడిసి పైఁటచెఱఁగు లంకించికొని యంతలోఁ గదిసి బాహుపంజరమున గాఢముగా బంధించుకొని పర్యంకము

నకుఁ దెచ్చి యంకతలంబునఁ జేర్చికొని చుబుక మొత్తి మొగము మొగమున కానించి ప్యారీ బేగం! చూడు. ఇటు చూడు. నావలన దప్పున్న క్షమింపుము. వానిని జేప పట్టి తెప్పించెద. నేను మాత్ర మత్యాచారమును సహింతునా? ఉన్న విషయముం జెప్పితిఁ గాని నీవు చెప్పినదానిం జేయ నంటినా? ఏల యింతలో నింత కోపము? అని బుజ్జగించుచు నుండెను.

అంత నా రేయి యమ్మోహనాంగి నిదురించినదో? లేదో? ఘల్లున తెల్లవారినది. నిండుపేరోలగంబున కేతెంచిన తానీషా గారితోఁ ప్రభుభక్తి పరాయణుండగు మాదన్న భద్రాద్రి తాలూకా పైకమురాలేదు. నిన్నటితో సాలాఖరైనది. ఏమి యాజ్ఞ? యని విన్నవింపఁ నతండు కనుసైగచేసి తత్క్షణమ తహాసీల్‌దారును బట్టి తెప్పింపుమని హుకుం పంపించినాఁడు.

అక్కడ రామదాసుగా రనుష్ఠానముం దీర్చుకొని కచేరీ చావడిలోనికి వచ్చి 'సంవత్సరము ముగియులోపల నవాబుగారి పైకముం జెల్లింపవలయుఁగదా. నేను ఖర్చుపెట్టినదానిని భక్తి చేయుటకుఁ బూనుకొన్న నదియేమిచిత్రమో? ఇంతవఱ కిచ్చినట్లిప్పుడు చందాల ధనికు లొసంగుట లేదు. ఇంకఁ దాలూకాలో వసూలు కావలసిన సిస్తు రెండులక్షల యేఁబది వేలు. దొంగలు దోఁచుకొనిపోయినది లక్ష యేఁబది వేలు- మిగిలిన రెండు లక్షలు నాక్రిందఁబడెంగావలయును. అయ్యో! రామా! యీ యాఱులక్షల పైకము నేఁ డెట్లు చెల్లింతు—

### గేయము.

నీ సంకల్పం బెటువంటిదో కన నెంతవాఁడ రామా
వాసితొలఁగి నీదాసజనులు భువి గాసిపడిన యాఘన మెవ్వరిదో॥నీసం॥
ప్రోచినమతి విడఁజూచిన నీకృపఁ గాచియుండుగా నీ
తోఁచితోఁచకను దొడరి కరంబులుచాచి పరులనే యాచనచేయను॥
—నీసం॥

అని కీర్తించుచుండ యమకింకరులవలె నిష్ఠురులైన కఱకు తురక జవానులువచ్చి హుకుము చూపించి యున్నవాని నున్నట్లు పట్టుకొని రమ్మనిరని చేతులకు సంకెలలువైచి విచ్చు కత్తి పహారాలతోఁ దోడ్కొని పోవుచుండిరి. భద్రాద్రిలో నా భక్తునకువచ్చిన యాపద కాబాలగోపాలము నాఁడు కంటఁ దడివెట్టనివారు లేరని, యొక్కరును బాయిరాఁ జేయలేదని యింకను వ్రాయవలయునా ?

అట్లు తహశీల్దారుగారిని భార్యతో మాటలాడనీక పిల్లవాని నైనఁ జూడనీక యన్నముం దిననీక సంకెలలువైచి పట్టుకొని పోవుచుండఁ బరిపరిగతుల శ్రీరామచంద్రుని జీడుచు దూరుచు, భూషించుచు దూషించుచు భావించుచు సేవించుచు రాజుసేవకుల వెంటఁ బోవుచు——

శా॥ "పోకన్మానదు దేహ మేవిధమునం బోషించి రక్షించినన్
రాకన్మానవు హానివృద్ధులు మహారణ్యంబులో డాగినన్
గాకన్మానవు పూర్వజన్మకృతముల్ కాఁగల్గు నర్థంబులున్
లేకన్మానవదెంత జాలిపడినన్ లేముల్ సిరుల్ రాఘవా."

అని ధైర్యము వహించుచు గోల్కొండఁ జేరి నవాబును

దర్శించి తల వంచి సలాము చేయఁ దానీషా మండిపడి తహ
శీల్ దారుగారూ! పైక మేది? సాలాఖరైనను పంపలేదేల?
నవాబుగారు చండశాసనులని యెఱుంగవు గాఁబోలు” నని
పలుక, స్వామీ! ఇంక రెండులక్షల యేఁబదివేలు వసూలు
గావలయును. లక్ష యేఁబది వేలు చోరులు హరించిరి—అని
చెప్పుచుండఁ దానీషా రూక్షేక్షణములఁ బఱపుచు భయంకర
ముగా గర్జించి, దొంగా! రామాలయముం గట్టించి బొంకు
చుంటివా? మే మెఱుగ మనుకొంటివా? యన నా
గోపన్న స్వామీ! కల వృత్తాంత మంతయుం జెప్పుచుంటిని.
దేవా! రామాలయమునకు రెండు లక్షలు మాత్రమే—అను
చుండఁ దానీషా హుకాన్కు నుబీల్చి ఓ గడుసు బాపఁడా!
నీవు భక్తుఁడవు మంచివాఁడ వని యుద్యోగ మిచ్చినందులకుఁ
దగినట్లు చేసితివి. మా యుత్తర్వు లేనిదే ఖర్చు పెట్టుటకు
నీకు గుండె యెక్కడిది?” అన నయ్యా! మీ రాజ్యములోనే
శ్రీరామచంద్రులవారి కాలయము గట్టించితి. ఆ ప్రఖ్యాతి
యంతయు మీదే యని బంధితుం డనుచుండ నింక నోరు
మూయుము. మా యానతి లేనిది నీ వట్లు సల్ప వచ్చునా?
మా పైక మారు లక్షలు చెల్లింపనిచో నిమ్ము వదలము.
అంతవఱకుం జైలులో నుండుము.” అయ్యా! గడు విచ్చిన
ధనము చెల్లించెద నన ఛీ తులువా! పాఱిపోఁజూచుచుంటివా.
విడువను. విడువను. ధనము చెల్లించిననే విడిచెదను. అంత
వఱకు జైలులో నుండుమని పంపివైచి కొలువు చాలించి నవా
బంతిపురి కరిగెను.

# ఏడవ ప్రకరణము.

శ్లో॥ హారిద్దుఃఖా నిభక్తేభ్యో హితబుద్ధ్యాకరోతి వై
శస్త్రక్షారాగ్నికర్మాణి స్వపుత్రాయ యథాపితా॥

భగవంతుఁడు తన భక్తులకు హితబుద్ధితోడనే దుఃఖములను గలిగించుచున్నాఁడు. కుమారుని కారోగ్యభాగ్యము లభించుటకేగదా తండ్రి యతని వ్రణమునకు ఛేదాదు లాచరించి బాధ కల్గించుట. కనుక రామదాసను రత్నమును గష్ట పరంపరలను నికషోపలముల నొఱిపిడివెట్టి దుష్కృతమాలిన్యముం బోఁదట్టి దివ్యతేజోవంతునిం జేయుచున్నాఁడు శ్రీరామచంద్రుండు. కష్టములు వచ్చినప్పుడే మానవుని గాఢ భక్తి ప్రభావము ప్రకాశించునది. పుటము వేయుచున్నకొలందిగదా బంగారమునకు వన్నె వచ్చునది.

## రామదాసు కష్టములు.

బలవద్విరోధము దుస్సహము సుఁడీ. అందుం దుష్టులతోడి పగ నేమనవలయు. "అకరుణత్వ మకారణవిగ్రహమ్". రామదాసేమి చేసెనని సితారా కతనిపైఁ గోపము ? రాణిగారి యాజ్ఞయని చెఱలో నున్న దాసునకుఁ బావుసేరు బియ్యముం బావుసే రుప్పుం గలిపి బత్తె మొసంగిరి. దాసిట్లు దుఃఖించుచున్నాఁడు. రామా ! ఈ యన్నము నెట్లారగింతును.

## గేయము.

ఏలాగు తాళుదు నేమిసేతు రామ – ఈజాలిచేతను తాళజాలనురా
దీనజనులకెల్ల దిక్కు నీవె రామ – మనమున నిన్ను నే మఱవ నో రామా ॥ఏ॥

అని వేడికొని బచనంబు సేసికొన దివ్యాన్నంబయ్యెనఁట. దానిని భుజించి రోజులు గడపుచు రామా! నీ నామస్మరణ మున కితర కార్యము లంతరాయము లగుననియా? నన్ని యేకాంత స్థలమునకుం ద్రోఁచితివి. తండ్రీ! నీ లీలల నెవ రెఱుంగఁగలరు. అని రామధ్యాన నిమగ్నుఁడై సంతోషము గానే యుండెను.

"ఇంటికంటె గుడి పదిల' మన్నట్లు గోపన్న సంతోషముగానే కాలము గడపుచున్నాఁడని సితారా విని పండ్లు పటపటగొఱికి యతనిఁ గొరడాలతోఁ గొట్టుఁడని యాజ్ఞాపింప నా భటు లట్లుచేయుచుండ

గేయము.

అబ్బబ్బా దెబ్బలకు తాళలేర రా మప్పా గొబ్బున నన్నాదుకోర

... ... ... ... ... ...

పరులకొక్క రువ్వ యీలేదుగదరా ఓ పరమాత్మ! నీపాదములు నమ్మినారి
కొరడాలు తీసుకకొట్టిరి గదరా హరనుత గోవిందహరి తాళలేర॥ అబ్బబ్బా॥

అని శరీరమును భటులకు నాత్మను హరికి నర్పించియుండ బాపురే రామానుగ్రహమున నాదెబ్బలవలనఁ గందఁడయ్యె, బాధ నెందఁడయ్యె.

మఱియుఁ గొంతకాలమునకు రాజ్ఞాజ్ఞచే ముండ్లపైన నడి పించిరి. ఏమికష్టము. దాసునకు రాముఁడున్నాఁడు గదా!

గేయము.

రామా దయఁజూడవే భద్రాచలధామ నను బ్రోవవే

... ... ... ... ...

తాటక సంహరణ మేటి రాక్షసకోటి మదహరణా

నీటుతో నీనామకోటి వ్రాసితి నీకు సాటిలేదని సారెసారెకు వేడితి। రామ॥

అనిస్తుతింప నాబాధం బోరయుండవయ్యె. భక్తులమాటలే మహా మంత్రములు.

మఱియొకనాఁ డిట్లే యందఱుఁ బైకము గాఁజేసి మొండిచేయి చూపెదరు. ఇతరులకు భయము గలుగునట్లు శిక్షింప వలయునని సితారా యాజ్ఞాపింప దాసు చేతులకుఁ గిట్టకోలలు వేసి కొట్టిరి.

గేయము.

అబ్బబ్బా దెబ్బలకు నోర్వలేర జబ్బుసేయకరార తబ్బిబ్బాయెరా

అట్టి నిన్ను పూజించినట్టి చేతులనిదిగో గిట్టికట్టికొట్టే రెట్టుతాఁగుదునయ్యా!

... ... ... ... ... ...

అని వేడుకొనుచుండ ఫెడేల్ ఫెడేల్ మనఁ గొట్టుచుండిరి. కాని యాదెబ్బలు రామదాసు శరీరమున బూడిదెలోఁ బోసిన యాజ్యధారలయ్యె.

అదిచూచి భటులు నివ్వెఱంపడి యీయన పసరుకట్టెఱుం గునా ? యేమి ? జెయిలులోనికి వచ్చునపుడు దేహమునకుఁ బసరుపూసికొని వచ్చినాఁడు కావలయు నని యమ్మూర్ఖులు శరీరము శోధించి తోమి స్నానముచేయించి కత్తులపై నడిపిం చిరి. ఐన నేమి తారకమంత్ర బలమ్మున నవి భూమిలోనికిం గ్రుంగిపోయి యించుకంతయుఁ గాయంబున గాయముచేయ వాయె. అదిచూచి రాజసేవకు లిదియేమిచిత్రము. వీనికిం గారడివిద్య వచ్చునాయేమి ? అట్లైన నీదెబ్బతో నన్నియుం

దీరుసని సితారాకుం జెప్పి పెద్ద యుక్కుగుండును నీవు విలుగు నట్లు పైఁబెట్టి యూరంతయుఁ ద్రిప్పుచుండిరి. గోవర్ధనోద్ధారుఁ డుండ గోపన్న కేమి కొదువ ?—

గేయము

భారము లన్నిటికి నీవే కలవని నిర్భయుండనైయున్నారా
దారితప్పక నీవు దరిజేర్చెదవని ధైర్యముతోచిందిరా శ్రీరామ
—భారము॥

... ... ... ... ...

అని వేఁడుచుండ నతనికిం బెండుమోసినట్లుండి వెంటఁ బర్వెత్తు చుండ నా సేవకులు అబ్బా ! యీ బక్కబాపని కెంతబల మున్నదిరా ? మన మైఁదార్గురమే వీనిచెంత నుండుచో నప్పడము ముక్కలవలె మనల విఱిచి పాఱిపోఁగలఁడురా” యని గుస గుస లాడుచు నతనిం జెయిలులోనికిం బంపివైచిరి.

సితారా కేల బుద్ధిలేదో ? మండు వేసవికాలములలోఁ గాలు చున్న యిసుకపైఁ గోపన్నను నిలువం బెట్టుచుండె. 'లక్ష భక్ష్యముల భక్షించు లక్ష్మయ్య కొకభక్ష్యము లక్ష్యమా ? ” రామా ! శీతోష్ణాదిద్వంద్వములఁ దుల్యముగాఁ జూడవలయు నని నేర్పుటకా నాకీశిక్ష నేర్పఱచితివి. అని రామధ్యానము చేయుచుఁ బూఁబాన్పుపైనుండునట్లుండె, ఇతఁ డపర ప్రహ్లాదుఁడా ? యేమి ?

చం॥ పలువురు దానవుల్ పొడువ బాలుని దేహము లేశమాత్రమున్
నొలియదు లోపల న్రుధిరముబ్బదు కందదు శల్యసంఘము

స్థలియందు దృష్టి వైభవము నష్టము గాదు ముఖేందు కాంతియుం
బోలియదు నూతన శ్రమము పుట్టదు పుట్టదు దీనభావమున్.

—భాగవతము

సముద్రములోఁ బడినాఁడు. అదృష్టవశమునఁ గలము చిక్కినది. ఇంక నుల్లోలాభీలకల్లోలమాలాసంఘట్టనము లెన్ని కల్గిన నేమిభయ మున్నది? జ్ఞాని యవి తన నొక దరి వట్టింప వచ్చె ననియు, నజ్ఞాని తనను ముంచవచ్చె ననియు మాత్రము భేద ముగాఁ దలంతురు. రామదాసునకుఁ దారకము లభించినది. దాని ప్రభావముఁ బ్రత్యక్షముగా ననుభవించినాఁడు. కనుక—

గేయము

శ్రీరామ నీ నామ మేమి రుచిరా ? ఓ రామ నీ నామ మెంత రుచిరా

... ... ... ... ...

కదళీఖర్జూరాది ఫలముల కన్నను పతితపావననామ మేమి రుచిరా॥ శ్రీరామ

... ... ... ... ...

పనస జంబూ ద్రాక్ష ఫలరసములకంటె నధికమౌ నీ నామ మేమి రుచిరా—
—శ్రీరామ

శరణన్న జనముల సరగున రక్షించు బిరుదు గల్గిన నామ మేమి రుచిరా॥ శ్రీరామ

ఈ రుచి యిట్టిదని పల్కఁ దరమా? నాయనలారా! ఈ రుచి షడ్రుచులలోనిది కాదు. ఇది యుపమాతీతము. ఇది యను భవైకగోచరము సుఁడీ. "పంచదారకన్న పానకంబునకన్న మావిపండుకన్న మాధ్వీకన్న" మిన్నయైన దనుట కానిమాట. సదృశపదార్థము లేనిది పోలిక యెట్లు? అమృతమందు రేమో? అమృత పానరతులకును బునర్జన్మము గలదు కాని

యీ నామామృత పానరతులకు లేదు. కాన నమృతమును దీనికి సాటిగాదు. "ఏమి రుచిరా?" అనుటవలననే నేటికి గోపన్న తద్రసాస్వాదనానంద నిమగ్నుం డైనాడని తేలుచున్నది. కనుకనే అన్ని యిక్కట్టులకుం దాళ గలుగుట. భళిభళీ రామదాసా! నీవ ధన్యుఁడవు ధన్యుఁడవు.

అట్లు పరవశుండైన దాసుం గాంచి పరులు వేకువం జూచి నిర్జీవుండ కాఁదలంచి బిగ్గరగాఁ బిలువఁ గొంతవడికి లేచె. అపుడ్యాధులు గాఢ సుషుప్తి యనుకొనిరి.

పిమ్మట నమ్మహాభక్తుండు నీరమునకై కూపమ్మున కరుగుచో మధ్య మార్గమ్మున వృశ్చికదష్టుం డయ్యెను. ఉన్నదిగదా రామ మంత్రము.

గేయము

" మేలైన చిటికెన వ్రేలు - ప్రాతఃకాలమందునఁ గుట్టె తేలు. "

రామ రక్షింపుము. అని మొఱవెట్ట నాబాధ పోయెను.

అది కని భటు లాశ్చర్యచిత్తులై "ఏమయ్యా! నీ యొద్ద మందులు మ్రాఁకులు మంత్రము లేమైన నున్నవా? ఎన్ని బాధలకు నోర్చుకొనియెదవు" అన గోపన్న యిట్లనియె. నేను మందుల మ్రాఁకుల నెఱుంగ.

గేయము

రామునివారల మైనాము - ఇతరాదుల గణనసేయము

ఆమహా మహుఁడు సహాయుఁడై విభవముగా మమ్ముఁజేపట్టి గారవించును——

సదా॥రా॥

... ... ... ... ... ...

గ్రహ గతులకు వెఱవఁబోము - మాకుఁ గలదు దైవానుగ్రహము
ఇహపరములకు మాకిఁక నెవ్వరడ్డము - మహి రామబ్రహ్మ మంత్రము—
బూనియున్నాము ॥రా॥

... ... ... ... ... ...

అని నిర్భయముగాఁ బలికినాఁడు. నాటినుండియు సీతారా మెదుటనున్నఁ దప్ప నామె యానతిం బూని దాసును బాధింప మానిరి. ఇతఁడు తిట్టినఁజాలు పిల్లా మేకా మనము చచ్చిపోయెదమని భయం పడిరి. ఇట్లు దాసు చెఱలో గడి యలా? రోజులా? నెలలా? యేండ్లు గడపుచుండెను. ధనముం జెల్లించిననే వదలుట. ఎవరు చెల్లించెదరు. ఈనేర మునఁ దానుం గలఁడని ప్రజలు నవాబు ననుకొందురని తలంచి మాదన్నగారు చెఱ విడిపింపఁ గలిగియుండియు నూరకుండెను. తదితర బంధువు లాఱులక్షలఁ దెచ్చి కట్టువా రెవరున్నారు? అందువలనఁ జెఱలో మితరహితమైన కాలముం గడపవలసి వచ్చి యెల్లప్పుడు రాముని గీర్తించుచు,

గేయము

సీతారామస్వామీ నేఁ జేసిన నేరంబేమి?
ప్రేమతో నవరత్నంబులు చాపిన హేమకిరీటం బడిగితినా?
కోమలమగు నీ మెడలో పుష్పపు దామములిమ్మని యడిగితినా?
మోమోటం బిడకుండఁగ నీవగు మురుగులు గొలుసులు నడిగితినా?
కమలేక్షణమిము సేవించుటకై ఘనముగరమ్మని పిలిచితిఁగాని॥ సీతారామ॥

ఇట్లు గోపన్న యెడంద నిష్కామ భక్తి లహరితోఁ ణకినను

గేయము

" పండ్రెండేండ్లాయెను శ్రీరాములు బంది-ఖానాలోనే యుండినాను
శ్రీరాములు
అర్థము తెమ్మనుచు నన్ను శ్రీరాములు-ఇప్పు-డరికట్టఁ దలఁచుచున్నారు
శ్రీరాములు

ఏమిటికి దయరాదు. అని పెక్కుడుములఁ జెందుచుఁ బండ్రెండేండ్లు రాముని ధ్యానించి చివఱకు విసివి, ఇఁక ధనముఁ గట్టినిది వదలఁడని తలఁచి శరీరముపై నాశవిడువక

'సర్కారు పైకము తృణముగ నెంచుమీ రామచంద్రా ? యీ
చెప్పరమునఁ గాచి యప్పుదీర్చుమయ్య రామచంద్రా.'

అని వావిచ్చి కోరినాఁడు. చూచితిరా ! అస్తినాస్తి విచికిత్సాగ్రస్తచిత్తులారా ! రాముని ధనముం దెచ్చి కట్టుమని భక్తుఁ డాజ్ఞాపించుచున్నాఁడు' ఎంత విశ్వాసమో ? ఎంత దృఢభావమో ? ఎంత నిశ్చలభక్తియో ? రామదాసునకు.

అట్టి భక్త్యుద్రేకమునఁ గీర్తించిన కీర్తనలు రసపుష్టిగా నుండెనని వ్రాయు టనవసరము. ఎట్టి ఱాతిగుండె వానినైన నవి గఱగింపఁ జాలును. మఱి రాముని కేల దయరాలేదో ? అందువలన నిఁక నమ్మతోఁ జెప్పిచూతమను కొన్నాఁడు. మఱల దింపుడు కళ్లమాస జనించి పౌరుషము పుట్టించియైనఁ జూతమని——

గేయము

రామ నీచేనేమికాదుగా సీతా భామకైనఁ జెప్పరాదుగా
శరచాపములశక్తి దప్పెనా ? నీశౌర్యము జలధిలోఁ జొచ్చెనా ?

కరుణమాలి పైకము దెమ్మని భక్తవరుల బాధింప నీధైర్య మెక్కడపోయె॥
—రామ॥

అని తర్జించుటకు భక్తునకుమాత్రమే చనవుగలదు. చేసికొన్న భార్యకును లేదు. ఇప్పటికిని రామునికిం బౌరుషము కల్గలేదు. ఇఁక లాభము లేదనుకొన్నాఁడు. తండ్రికోపముం దల్లిగాని తొలఁగింపలేదని యెంచి.

గేయము

'ననుఁబ్రోవమని చెప్పవే-సీతమ్మతల్లి- ననుఁబ్రోవమని చెప్పవే'
అని తగినకాలముంగూడ నిర్దేశించి ప్రార్థించినాఁడు.

" అధిక రోషకషాయిత స్వాంతుఁడైన
నరపతికి విన్నవింపను న్యాయవస్థఁ
బైత్యదోషోదయంబునఁ బరుసనైన
జిహ్వకకుఁ బంచదారయుఁ జేదుగాదె?"

అనెఁగదా దమయంతి. మఱియు "పన్నెండేండ్లనుండి పగలు రేయి నాపన్నుఁడనై మిమ్ముల ఓజననీ - ఎన్నెన్నొవిధముల సన్నుతించినఁగాని కన్నులఁజూడఁడాయె-ఓజననీ" అని చాడీలు చెప్పినాఁడు ... ... కన్నతండ్రులింత కరుణమాలి భువిని ఉన్నవారలు గలరా ? ఓ జననీజనకతనయ......" అని వాపోయినాఁడు.

# ఎనిమిదవ ప్రకరణము

'బుద్ధిః కర్మానుసారిణీ' కర్మము ననుసరించియే బుద్ధియుఁ బ్రవర్తించుచుండును. కర్మ క్షయమగుటతోడనే దాసుండు సీతమ్మను 'సిఫార్సు' చేయమని కోరినాఁడు. ఆమె మాట దక్కించుకొన్నది. నిజమునకుఁ దల్లుల హృదయములు నవనీత కోమలములు-కరుణారసాప్లుతములు—

మ. అల వైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబుదా
పలమందార వనాంతరామృతసరః ప్రాంతేందు కాంతోపలో
త్పల పర్యంకరమా వినోదియగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము పాహిపాహి యనఁ గుయ్యాలించి సంరంభియై

—భాగవత.

నాఁడు పర్వెత్తినాఁడు. నేడు రామదాసు మొఱ చెవిపడుట తోడనే సీతమ్మతల్లి మగనియొద్దకు గబగబ పర్వెత్తినది. అంజలి వట్టి మనవిని వినుమన్నది. బిడ్డబాధ కెంత పరితపించినదో ఆతల్లి—

గేయము

దాసపోషణ బిరుదాంక సజ్జనులను గాసి నొందజేతురా
ఏసీమనైన దినేశవంశజులిట్లు మోసముచేయుదురా
కరిమొఱ లిడనాఁడు దురుసుగనేగి మకరిఁ ద్రుంచి కరిఁగావవా?
పరమపావనరామ చెఱసాలనున్న భూసురు నేల రక్షింపవో?
అతిపాపియైన యజామిళు నేలితి వతఁడేమి నీచుట్టమా?

అని చెప్పినది. మఱియు వినయము, చనవు, నుట్టిపడఁ గావుమని చెప్పినది.

"స్వామీ! యాబాల్యమునుండి సేవ సేయుచుంటి. పండ్రెండేండ్ల నుండి బాధలు పడుచుంటి.

"నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపం దగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సంరక్షించు భద్రాత్మకా" అని వేఁడుచున్నాఁడను. తమకేల జాలి గలుగలేదు. భాగవతుల సంరక్షింపఁ దలంచిన వేగిరపాటు వలన "సిరికిం జెప్పఁడు శంఖ చక్రయుగముం జేదోయి సంధింపఁ డే పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాంతరధమ్మిల్లము చక్కనొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీకుచోపరిచేలాంచలమైన వీడఁడు"

—భాగవత

భగవంతుఁ డని చెప్పుకొనెదరే! స్వామీ! నేఁ డేల యాలసించితిరి? అని పాదముల వ్రాలి బతిమాలుచున్న సతికై దండం బూని లేనగవు సొగసు మొగమునఁ గులుకుచుండ య న్నగధరుం డిట్లనియె.

ప్రేయసీ! నిజమే నీవన్నమాట ఐనను నియతిని దాటరాదు " అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభం " శుభమును గాని, యశుభమునుగాని చేసికొన్న కర్మము ననుభవించి తీర వలసినదే.

గోపన పూర్వజన్మమున నొక భూసుర కుమారుఁడు. అతం డింధనార్థ మడవులకేగి దైవవశమునఁ బట్టువడిన యొక కీరముం దెచ్చి దాని స్వేచ్ఛ నరికట్టి పంజరమునఁ బండ్రెండేం డ్లునిచి యనుదినము రామ రామ యని దానిచే ననిపించుచు విని

సంతసించుచుండువాఁడు. పిదప నతండు కాలధర్మమునొంది గోపన్నయై పుట్టి యన్ని యేండ్లు తత్ఫల మనుభవించినాఁడు. పునర్జన్మ హేతువగు తత్కర్మ మనుభూతం బయ్యెఁ గాన నీ యిష్టప్రకారము నిదె రామదాసుని రక్షించి వచ్చెదం జూడు మని లక్ష్మణద్వితీయుండై మ్లేచ్ఛాకారములతో నా యర్ధ రాత్రమునఁ దానీషా యంతిపురిం జేరి కవాటముం దట్టె. భార్యతోఁ దనకప్పుడు వచ్చిన సుస్వప్న వృత్తాంతముం జెప్పు చున్న తానీషా 'ఎవఁడురా? యిప్పుడు తలుపు తట్టినాఁడని యించుక కోపముతో వచ్చి తలుపుఁదెఱచి 'అయ్యా! పైక మిదిగో'యను మాటల విని చల్లవడి భార్య నవలి కంపి ధనేషణుం డగునతండు సుఖోపవిష్టుండై యిట్లు సంభాషింపఁ దొడంగె.

తానీషా—ఏదేశము మీది ?

రాముఁడు—అయ్యా! మాది యొక దేశమని యేమున్నది ? అంతట నుండెదము.

తా—ఇప్పు డెచటనుండి వచ్చితిరి?

రా—భద్రాద్రినుండి.

తా—మీ రెవరు ?

రా—కన్పించుచున్నను దెలిసికొన లేనపుడు చెప్పిన మొదలే యర్థముకాదు.

తా—ఓయీ! మీ వంశము నే నడిగినది.

రా—సూర్యవంశమని తలంతురు.

తా—మీరు మహమ్మదీయులు గారా?

రా—మమ్ము మహమ్మదీయులు మహమ్మదీయులని, హిందువులు హిందువు లని తలంతురు.

తా—మీరు మా బువ్వ తిందురా?

రా—ప్రేమతో నెవరు పెట్టినను తిందుము.

తా—అట్లైన మీరు వెలి వేయఁబడరా?

రా—వేయఁ దలంచినవారికిం దొరకినఁగదా ?

తా—దొరకక యెం దుండెదరు ?

రా—సుజనులయెడ.

తా—మీ వృత్తి ?

రా—కాచుకొని యుంటయే.

తా— మీ రెవరి బంటులరు ?

రా—దాసుని బంటులము.

తా—చెఱలో నున్న గోపన్న భక్తుఁడు మీ దొరా ?

రా—అవును. మా దొర లా భక్తాగ్రేసరులే. వారు చెప్పినట్లు మేము నడుచుకొందుము.

తా—మీ నామధేయములు ?

రా—ఇతఁడు లక్ష్మోజి. నేను రామోజీని.

తా—అచ్ఛా, అచ్ఛా. హిందువుల పేరులు. మహమ్మదీయుల ఆకారములు. మీ కొక జాతి ఆచారము లేనట్లున్నది ?

రా—చిత్తము. ఎవ రెట్లు తలంచిన నట్లే.

తా—ఎన్ని దినములనుండి దాసునిఁ గొల్చుచుంటిరి ?

రా—మూఁడు తరములనుండి.
తా—జీత మెంత?
రా—జీతమునకుగాదు. ప్రసాదమునకే.
తా—మీరు మా కొలువులో నుండరాదా ?
రా—మీ మనస్సు నిలుకడ లేనిది?
తా—లేక మే మేమి చేసితిమి ?
రా—రామదాసును జెయిలో వైచితివిగదా ?
తా—ధనమును హరింపలేదా ?
రా—తాను పొట్టకుఁ దిన్నాఁడా? ధర్మ కార్యమునకేగదా వినియోగించినది ?
తా—అందుకు నాకు సంతసమే. కాని యందఱు నట్లే చేసిన?
రా—సరే. పైకముం దీసికొనుఁడు.
తా—అచ్ఛా. అచ్ఛా. సంతసము. కూర్చుండుఁడు. పైకమంతయుం దెచ్చితిరా?
రా—చిత్తము.
తా—ఆఱులక్షలు చెల్లింతురా?
రా—మేము ఋణ ముంచుకొనము. రసీదు వ్రాయింపుఁడు.
తా—పైకము చెల్లింపుఁడు.
రా—మా దాసుగారిని వదలింపుఁడు.
తా—తెల్లవారిన పిదప.
రా—పెక్కుమాటలేల? పైకము చెల్లించుకొనుఁడు.
తానీషా ఇంత పైకము నెట్లు మోయఁగలిగితి రన, రాముఁడు నవ్వుచు మాకిదియే భారమా ? మే మెంతబరువు మోయు

చున్నారమో మీ కెట్లు తెలియును ? అనుచుండఁ బైకముఁ దీసికొని రసీదు వ్రాసి ముద్రవేసి యొసంగ దాని నందుకొని రాముఁ డల్లనం జని తమ్మునితోఁగూడ నదృశ్యుండయ్యె.

అక్కడ రామదాసు చేయునదిలేక యిట్లు విలపింపఁదొడంగె. స్వామీ ! ఎంతకాలమునకు నీకు దయరాలేదే. ఇఁక నేమి చేయుదును. స్వామీ ! సీతా రామచంద్రప్రభూ !

మ. కరి నేలింది హుళక్కి ; ద్రౌపదికిఁ గోకల్ మెచ్చి యిచ్చింది స
బ్బర ; కాకాసురునిం గటాక్షమునఁ జేపట్టిం దబద్ధం ; బహో
శరణన్నం బగవాని తమ్మునికి రాజ్యం బిచ్చుట ల్గల్ల ; యి
త్తరి నన్నేలిన నిక్క మీకథ లనంతా ! భావనారాయణా ?

ఓ రామచంద్రా ! ఓ కరుణాపయోనిధీ ! ఓ దాశరథీ!ఓ భక్త జనసేవధీ! ఓ పార్థసారథీ ! ఇఁక నాశరీరముపై నాస వదలితిని

శ్లో॥ త్వమేవ మాతాచ పితాత్వమేవత్వమేవ బంధుశ్చ గురుస్త్వమేవ
త్వమేవ విద్యాద్రవిణంత్వమేవత్వమేన సర్వంమమదేవదేవ.

నాకు తల్లి, దండ్రి, గురువు, బంధువు, విద్య, ధనము దేవ ! ఒకఁడ నేల సర్వము నీవే. అంతయు నీకయర్పించితి. ఇంతవరకుఁ జెఱ నుండి విముక్తుఁడను గా నుంకించితిం గాని దేవదేవా ! బుద్ధి వచ్చినది. ఈ బుద్బుదప్రాయమైన కాయముం బడవేయుటకుఁ జెఱసాల యైననేమి ? చంద్రశాల యైననేమి? చెఱ నీ స్మరణమున కడ్డువచ్చినదా ? కారాగారము తారక జపమున కవరోధమయ్యెనా ? చేతులం గాళులం బంధింతురుగాని హృదయము నరికట్టలేరుగదా ? వలదు. వలదు. రామా ! నాకింక

వాంఛవలదు. పాలించుకొమ్ము. బాధించుకొమ్ము. సర్వము నీ యిచ్ఛాధీనము. తండ్రీ! నాకేమియువలదు. ధనమిచ్చి బంధ విముక్తునిం జేయుమనుట యజ్ఞాన విలసితము. జన్మహేతువు లగు నీ యాశాపిశాచములు నాచెంతకుం జేరకుండుగాక! తండ్రీ! నీ నామస్మరణము నాకు విజ్ఞానకిరణము. నీచరణము నాకు శరణము. నీ పదపద్మములపై మన్మనశ్చంచరీకము నివసించుంగాక. అని నిమీలితాక్షుండై ప్రతిదినంబునట్లు భావ బలంబున రామసన్నిధానముం గల్పించుకొని

శ్లో॥ శ్రీరాఘవేతి రమణేతి రఘూద్వహేతి రామేతి రావణహరేతి రమాధవేతి
సాకేతనాథసుముఖేతి చసుప్రతేతి వాణీసదావదతు రామహరే హరేతి
—రామకర్ణ

అనియుం

శ్లో॥ జిహ్వే కీర్తయ కేశవం... ... ... (37 పేజీ చూ)

అనియు నెచ్చరించి షోడశోపచారంబులం బూజించి

శ్లో॥ వందే సాధకవర్గ కల్పకతరుం వందే త్రిమూర్త్యాత్మకం
వందే నాదలయాంతక స్థలగతం వందే త్రివర్గాత్మకం
వందే రాగవిహీనచిత్తసులభం వందే షడబ్జస్థితిం
వందే పూర్ణదయామృతార్ణవ మహిం వందే సదారాఘవం
—రామకర్ణా

చూర్ణిక

"శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండభాండ తండోపతండకరండ
మండల శాంతోద్దీపిత సగుణనిర్గుణాతీత సచ్చిదానందపరాత్పర
తారక బ్రహ్మాహ్వయదశదిశాప్రకాశం సకలచరాచరాధీశం॥
... ... ... ...

దుష్టనిగ్రహ శిష్టపరిపాలనోత్కృట కపటనాటకసూత్ర
చరిత్రాంచిత బహువిధావతారం శ్రీరఘువీరం
... ... ... ...
భవజనితభయోచ్ఛేద ఛిద్రమచ్ఛిద్రం భక్తజనమనోరథోన్నిద్రం
శ్రీమద్భద్రాచల రామభద్రం రామదాసనుప్రసన్నం భజేహం
భజేహం భజేహం." ... ... ...

అని దేహేంద్రియ పంచకంబుల మఱచి మానసపూజ సేయుచో నిట లోర్ధ్వతలంబునం బాఱిన యంతర్దృష్టికిం జిత్కళాసందర్శనాంతర మనిర్వచనీయజ్యోతి సర్వవ్యాపక నిరతిశయానంద పరమాకాశంబున దుర్నిరీక్షమగు సహస్ర కోటి సహస్రభానుప్రభాభాసమానము శ్రీరామ పరబ్రహ్మము పొడగట్ట నద్వితీయాప్రమేయ నిర్భరానంద పారావారంబున మునిఁగి పరవశుండై నిశ్చేతనుండై పడియుండె.

అంత నెప్పటికో కనులు విచ్చిచూడ నెల్లెడల రాములే కన్పించుచుండిరి.

"అంతా రామమయం—ఈ జగమంతా రామమయం" అని పాడుచు నృత్యము చేయుచుండ శ్రీరామచంద్రుండు ప్రభుభట వేషముతోవచ్చి రసీదిదిగో! రామదాసుగారూ! యని విసరి వైచి చనియె.

శ్లో॥ యోమాంపశ్యతి సర్వత్ర సర్వంచమయిపశ్యతి
తస్యాహం నప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి. —భగవద్గీత

ఎవఁడు సమస్తభూతంబులయందు నన్నును నాయందు సమస్త భూతములను జూచుచున్నాఁడో వానికి నేను నాకు వాఁడు

ప్రత్యక్షస్వరూపులుగా నుందుము. అని కృష్ణపరమాత్మ పలికెను.

రామదాసున కారసీదు కాగితము రాముఁడుగానే, వచ్చిన భటుండును రాముఁడుగానే ఒకఁడేమి చెఱసాలయుం గుడ్యంబులు దిక్కులు భూమి గగనము అంతయు రామమయమే. ఎక్కడచూచిన రాముఁడే రాముఁడే. గోపన్న పిచ్చివాఁడు వలె గంతులువైచుచు నానందాశ్రులు రాల పాడుచున్నాఁడు.

గేయము.

అంతా రామమయం ఈ జగమంతా రామమయం
అంతరంగమున నాత్మారాముఁ డనంతరూపముల వింతలుసల్పఁగ
సోమసూర్యులును సురలు తారలును ఆ మహాంబుధులు నవనీజంబులు
అండాండంబులు పిండాండంబులు బ్రహ్మాండంబులు బ్రహ్మలు మొదలుగ
నదులు వనంబులు నానామృగములు విహితకర్మములు వేదశాస్త్రములు.
—అంతా రామమయం॥

అనిపాడి గంతులువైచి యానందాశ్రు లురుల నవశాంగుఁడై నిశ్చేష్టుఁడై యంతర్నిరీక్షణ మొనర్చుచుఁ దెల్లవాఱులు గడపి నాఁడు. ఏమి యా బ్రహ్మానందానుభవము! ఏమి యానిరతిశయ సుఖానుభూతి! ఇట్టి నిజమైన భక్తులెందఱో మన భారతభూమి నలంకరించియుండిరి.

# తొమ్మిదవ ప్రకరణము

పూర్వకాలంబున నొక విప్రుఁడు సమస్తతీర్థమాహాత్మ్యములఁ దెలిసికొని యందు గంగామాహాత్మ్యములోఁ బ్రయాగయందు గంగాస్నాన మాచరించి యొకవర్ష మతిభక్తితో శివు నభిషే కించి పూజించిన శివుఁడు ప్రత్యక్షుఁడై దేవేంద్రభోగము నొసంగునని యుండఁగా నెఱింగి యతం డాసమయి నట్ల యనుదినంబుఁ బూజించుచుండెను. సంవత్సరము కావచ్చెను. ఒక దినమే కొదవ. ఇంతలో నా విప్రుఁడు విసివి శివుఁ డింకం బ్రత్యక్షము కాకపోయెనని వికలాత్ముండై యా జలకుంభము నెత్తి దురాగ్రహచిత్తుఁడై కృత్తివాసు నడినెత్తి మొత్తె. వెంటనే యాలింగమునుండి యాశ్వరుండు దృగ్గోచరుండై "ఓయి కోపీ! మెల్లితో వత్సరవ్రతము పూర్తియగునే. ఒక్కదినము సహింపవైతివి. ఇట్టి దురాగ్రహకారణమ్మున నుత్తరకాలమ్మున మహమ్మదీయ వంశమ్మున జనించి మత్పూజాప్రభావమ్మున మహాభోగ మ్మనుభవించి యాజన్మమ్మున శ్రీరామచంద్రమూర్తిని సందర్శించి కృతార్థుం డయ్యెదవని పలికి యదృశ్యుండయ్యె. అకారణమ్మున నా ద్విజుండే యిప్పుడు తానీషాయై జనించెను.

'ఏతస్మిన్నేవకాలేతు ప్రయాగే ద్విజసత్తమః
శివ్యద్వయసమాయుక్త స్తపశ్చరతిదారుణం
శవాసనేసమావిష్ట స్త్రమహాత్రేః పయః పిబన్
సహస్రికం పంచశతం వత్సరాస్తుగతేశకే
శాలివాహనరాజస్య వేదవేదాంగ పారగః
తద్దోషాత్సచవిప్రస్తు జాతోయవనవంశకే

మ్లేచ్ఛభాషా ప్రయుక్తేన నామ్నా తానిష నామకః
విప్రవంశేతస్య శిష్యాజాతౌ పరమధార్మికౌ
అక్కన్నశ్చ మదనశ్చైవ ద్వావేతౌ మంత్రిణావుభౌ

అని మార్కండేయ పురాణోత్తర భాగము మఱికొన్ని ప్రతులలో "అర్క మాధవనామానౌ ద్వావేతౌ మంత్రిణావుభౌ" అని కలదని శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు.

"ఒక ద్విజోత్తముఁడు ప్రయాగ యందుండి యిర్వురు శిష్యులు సేవ చేయుచుండ శవానమునఁ గూర్చుండు తామ్ర పాత్ర జలము ద్రావుచు నధిక నిష్ఠ ఘోర తపము చేయుచుండెరు. క్రీ 1578 లోఁ దద్దోషము వలన నవ్విప్రుఁడు యవనవంశమునఁ దానీషాయై జనించెను. ఆ శిష్యు లిర్వురు బ్రాహ్మణ వంశమున నక్కన్న మాదన్న లయి పుట్టి యతనికే మంత్రులై యుండిరఁ"ట. ఏది యెట్లున్నను తానీషా అక్కన్న మాదన్నలు పురాణములలోని కెక్కిరి.

ఇందువలనఁ దానీషా మంచివాఁడని మనవారి కందఱకు విశ్వాసము గలదనుట మాత్రము స్పష్టమగు చున్నది. కనుకనే గోపన్నను జెఱలో బాధించినది తానీషా కాదనవలసి వచ్చుచున్నది. మఱి యెవరోయొకరుండవలయుఁగా. కనుక దాని నిగ్రహము కంటఁ గట్టిరి. కొందఱు వీఁడు సర్వ సేనా నాయకత్వమునుండి తగ్గింపఁ బడినవాఁడు. కానట్లు చేసిన చేయవచ్చును గాని వీని కా యధికార మెక్కడినుండి వచ్చినది? ఒకరికి వీఁడు తోడ్పడ వచ్చునుగాని వీఁడే ముఖ్యుఁడు

మాత్రము కా వీలులేదు. కనుక తానీషా భార్య యగు సితారా గోపన్న కష్టములకుఁ గారకురా లనవలయును. నిర్హేతుకముగా ననవచ్చునా? నిర్హేతుకము గాదు. సహేతుకమే చూడుఁడు. ఈమె మహమ్మదీయసుతాభిమానవతి. అక్కన్న మాదన్నల ప్రాణము నిలువునఁ దీయించినది. ఎందఱో బ్రాహ్మణుల తలలఁ బోటన బంతు లాడించినది, నవాబును జేబులో వేసికొన్నది. ఇంత జగజంతకాక గోపన్న కష్టములకుఁ గారకురాలు మఱి యెవరు? నిజమునకు గోల్కొండ రాజ్యము పతనమైనది తానీషాగారి శుద్ధాంత కాంతాజనము వలననే ప్రకృత మనుసరింతము.

తానీషా హైందవులఁ బ్రేముడిఁ దిలకించుటవలన నిట్లు కవులు కల్పించిరేమో! అగుఁగాక. తానీషా మాత్రము సజ్జనుఁడు. భక్తుఁడు. అ క్కతనఁ గదా "ఎన్నఁడు నేని యోగివిభు లెవ్వని పాదపరాగ మింతయుం గన్నులఁ గానర" ట్టిహరిని గాంచ గలిగినాఁడు. ఆ పూర్వసంస్కార విశేషము వలననే రామలక్ష్మణులు పైకమిచ్చి పోయిన వెంటనే యేదియో స్మృతికి వచ్చినట్లు, నేదియో నిక్షేపము గోల్పోయినట్లు హృదయము పరితపింప నిట్లు తలపోయ దొడంగె.

ఆహా! ఆ బాలకుల సందర్శించుట తోడనే నా నేత్రముల కాప్యాయనము గల్గినదేల చెపుమా! ఆ యాజానుబాహువులు, నా యాకర్ణాంతవిశాలనేత్రములు. నా విపుల పీన వక్షస్థలములు, నా కటాక్షవీక్షణమాలికాగాంభీర్యములు, నా

మనోజ్ఞ వాచాచాతుర్యములు, నారమణీయతనూసౌందర్యములు, మానవులకు దుర్లభములు కావా? ఆహాహా! వారి చిఱునగవుల నిగనిగలు వెలుఁగు మొగములు నా హృదయ విమల దర్పణమునఁ బ్రతిఫలించి యనిర్వచనీయానందము గొల్పుచున్నవి. వారు నిక్కముగా రామదాసుగారి భటులే యైన నిన్ని కక్ష్యాంతరముల నిందఱు ద్వాఃపాలుర నతిక్రమించి యీ యర్థరాత్రమున నింత ధనమును వహించి నిర్భయముగా రాఁగలరా! అని యోజించి వారి పేరులు రామోజీ-లక్ష్మోజి. అంతట నుండెదరా? భక్తులు చెప్పినట్లు వినెదరా? భళిభళి. తెలిసినది. తెలిసినది. ఇంక సంశయమేల? ఆలోచన మేల? వారు వేల్పులు. వారు లోక రక్షకులు. వారు రామదాసుగారి యిష్టదేవతలు. నా కలలోఁ గన్పించిన స్వాములు. రామలక్ష్మణులు.

అయ్యో! చేతికింజిక్కిన నిక్షేపములఁ బోఁగొట్టుకొంటినే. అకటా! పాదములఁబడి వేడికొనకపోతిని. భళిరే రామోజి లక్ష్మోజి యన్నప్పుడైన గ్రహింపనైతిని. ఎంతమందమతినైతిని బాపురే! రామదా సెంతభక్తుఁడు. తనదైవముచే ధనమును మోయించినాఁడు. నే నట్టి భక్తశిఖామణిని గారాగారమునవైచి కలంచి దైవాపరాధ మొనర్చితిని. ఇఁక న న్నేవేల్పు రక్షించును? నాకు దిక్కేది? నేనావచ్చినది భటులుగదా యని తిరస్కారముగా సంభాషించి యుంటిని. అకటకటా! ఎంత యపచారమునకుఁ బాల్పడితిని. నా యీ దుష్కృతికి నిష్కృతిగలదే! భోగ్యైక

లాలసుండనై పాలసుండనైతి నని మఱల వారి స్వరూపముల మదికిఁ దెచ్చుకొని కొంతతడవు వినోదించి వేఁడియుఁ బెక్కు తెఱుంగులఁ దలఁపోసి పశ్చాత్తప్తచేతస్కుండై పాన్పుపైఁ బడినను నిప్పులపైఁ బడినట్లుండి యా నిశాశేషము నెట్లో గడపి వేగుజాముననే లేచి కాల్యాంబులం దీర్చికొని కొలువై యుండి రామదాసును శెఱ విడిపించి యభ్యంజనాదికము చేయించి పల్యంకికావైభవమున సభకురప్పించి సగౌరవంబుగా నెదురేగి నమస్కరించి సమీపించి కౌఁగిలించి క్షమింపుము. రామదాసా! నీ ప్రభావంబు నెఱుంగక నిన్నలయించితి. క్షమింపుము. అజ్ఞుండను. రాజసగుణుండను.

ఉ॥ "అచ్చపుఁ జీఁకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మఱలఁ జర్వితచర్వణులైనవారికిం
జెచ్చెరఁ బుట్టునే పరులు చెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిననైనఁ గానలకు నేగిననైన హరి ప్రబోధముల్."

—భాగవతము

మహాత్మా! నీవ ధన్యుండవు. రాములవారి కెంత దయ నీపై నని గత వృత్తాంతముం జెప్ప గోపన్న విస్మితుండై యిట్లనియె.

ఆహాహా! ప్రభువుల వారెంత ధన్యులు.

మ. "జలజాత ప్రభవాదులున్ మనములోఁ జర్చించి భాషావళిన్
బలుకన్ లేని జనార్దనాహ్వయ పరబ్రహ్మంబు నీ యింటిలోఁ
జెలియై మేనమఱందియై సచివుఁడై చిత్తప్రియుండై మహా
బల సంధాయకుఁడై చరించుటలు మీ భాగ్యంబు రాజోత్తమా!

—భాగవతము

అని నట్లు శ్రీరామునితో సంభాషింపఁ గల్గిన మీ భాగ్య మెంతని కొండాడవచ్చు. ఈ నిర్భాగ్యున కట్టి యానందము లేకపోయె నని రామా! నేను చేసిన దోస మేమని పెద్ద పెట్టున నేడ్వ, నా ప్రభుసత్తముం డూఱడించి యిదిగో రసీదు కై కొను మన రేయి మీరే వచ్చితిరిగదా యను నా భక్తు నితో నబ్బురంపడి నవా బిట్లనియె.

భక్తవర్యా! నేను రాలేదు. శ్రీరామమూర్తియే నా రూపం బున వచ్చినాఁడు కావలయు. ఆహా! యీ రేయి నా భవ నము భగవ ల్లీలలతోఁ గార్తార్థ్యమునందె. మహాత్మా! నీ వలన నేనును నా గృహమును, నా జన్మమును బావనమైనది. కనుక నే "సాధూనాం దర్శనం పుణ్యాం, స్పర్శనం పాప నాశనం" అని పెద్ద లందురు. అయ్యా! మీకుఁ గన్పింపకయే రాముఁడు నా కెట్లు కన్పించును. మీ వలన నీ దుష్టుఁడును ధన్యుఁ డైనాఁడు. అన గోపన్న మహానందము నంది డెందము గుదురు పరుచుకొని—

శా. కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు, వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తి నేమునిదె చక్రిం గంటి మెట్లైన ను
ద్దామధ్యానగరిష్ఠుఁ డైనహరిఁ జెందన్వచ్చు ధాత్రీశ్వరా!

—భాగవతము

అనిన పోతన్నగారి మాట లెంత సత్యములు. ఆహాహా! బాంధవమునన్నైనఁ బగనైన వగనైనఁ బ్రీతినైన బ్రాణభీతినైన" హరిని గనవచ్చును.

"ఏమయ్యా రామ బ్రహ్మేంద్రాదులకునైన నీ మాయఁ దెలియ వశమా?" అని కీర్తించె.

అంతఁ దానీషా, దాసుగారూ! మీ సేవకు లిచ్చిన పైక మును మీర తీసికొనుఁడు. మఱియు భద్రాచలము మాన్య ముగా మీ కిచ్చుచున్నారము. అని ఫర్మానా వ్రాయించు చుండ దాసుగారు నమస్కరించి అయ్యా! వలదు వలదు—

శా. సంపన్నుం డొరు గానలేఁడు తనువుక్ సంసారము న్నమ్మి హిం
సింపం జూచుఁ దదన్యుఁ డెత్తువడి శుష్కీభూతుఁడై చిక్కి హిం
సింపం డన్యుల నాత్మకున్ సమముగాఁ జింతించు నట్లౌటఁ ద
త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య మూహింపఁగన్
—భాగవతము

కనుక రామపాదములు నాకుఁ జాలును. అనుచున్నను బలా త్కారముగా వస్త్రాభరణాదులు, ఫర్మానా యొసంగి యుచిత పరివారముతో మహావైభవమున సాగనంపి క్రమముగా సర్వ సేనాధ్యక్షుఁ డగుని బ్రహీంకు సలిపిన క్రూరకార్యముల నెఱింగి యతని నాస్థానమునుండి తొలఁగించి యక్కన్నగారి కా "షాహా లష్కర్" పదవి నొసంగెను.

ఇక్కడ రామదాసుగారు—

"తిరుమలలోఁ బ్రభాతవిధి దీరిచి నీలగిరిన్ భుజించి శే
సరిగిరిఁ జందనంబలఁది చల్లని దాహము మంగళాద్రిలో
గురు రుచిఁద్రావి రంగపురిఁ గోమలితో శయనించి నట్టి యా
సరసుని జేరి నీవు మనసా! హరి పాదము లాశ్రయింపుమా.
—మానసబోధ శతకము

అనుచు భద్రాద్రి కరిగి గౌతమిలోఁ గ్రుంకి రామసన్నిధికిం జని జాగీరు ఫర్మానాలు మణిభూషణములు సర్వము రాముని కర్పించి తన రాకయెఱింగి మహోల్లాసముతో భజనచేయుచు వచ్చిన పౌరులం గలిసికొని మహానందంబున—

'జానకీరమణా కల్యాణగుణ సజ్జనావననిపుణా
ఓనామాలు వ్రాయఁగానే నీనామమే తోఁచు

... ... ... ...

ముక్తి వేనోల్ల నీదు భక్తిమాత్రము చాలు

అని కీర్తించుచు నింటికేఁగ గన్నీరు గండతలంబులఁ గాఱుచుండఁ జిఱునగవు మొగమునఁ గులుకఁ గళత్ర మెదురువచ్చి పాదములు గడిగి శిరమునఁ జల్లుకొని హిందువుఁడైన మన మాదన్న పంతులుగారైన జెఱ విడిపింపక పోయిరే? యన నక్కమ్మకొడుకు నవ్వి—

'నరహరిని నమ్మక నరులను నమ్మితే నరజన్మ మీడేరునా?
చెఱకులుండఁగ వెఱ్ఱిచెఱకులు నమలితే జిహ్వకు రుచిపుట్టునా మనసా
—నరహరి॥

అనుచుఁ బాదములఁ బ్రాలిన కుమారునిం గౌఁగిలించుకొని దీవించి తన్నుఁ బొగడుచున్నవారికి నమస్కరించి హరిసంకీర్తనము సేయుఁడని బోధించి కాలముగడుపుచు నిరత మన్నదానము సేయుచుఁ బౌరులకు భక్తిబీజము లంకురింపఁ బురసంకీర్తన మొనర్చుచుఁ బ్రతిచైత్రమాసమున రామోత్సవములు మహావైభవమ్మున నాచరించుచుండె.

ఇట్లు కొన్నియేండ్లు గడవ శూలబాధయు కాలుబెణఁకిన బాధయు నతిశయింప భద్రగిరి నెక్కి రాముని సేవింప వీలు గల్గమిచే—

'ఎక్కడకర్మము లడ్డపడెనో ఏమిసేతు నే రామా
అక్కటా ! నాకన్నులనెప్పుడు హరినిజూతునో రామా
మూఁడునెలలాయె రాముని ముందు నిలుకక
ఎన్నఁ డిట్లుండి నేను నెఱుఁగ రాఘవా. —ఎక్కడకర్మములు

అని పలుక నవి యుపశమించె నంతఁ దన్నుం జూడవచ్చినవారిని రామభజనసేయఁ బ్రార్థించి—

'రామ రామ యని నోట రవ్వంత సేపైన
నీమముతప్పక మంచినీతిపల్కనివాఁడు మత్తుఁడు మూఢచిత్తుఁడు
ధనమెంతో కల్గియున్న దానధర్మము లేనివాఁడు
హీనుఁడయ్యె భూమిలోను మానుగా నెన్నాళ్ళుబ్రతికిన నేటికి
—రామమ్మాటికి॥

అని చావు పుట్టుకలం గూర్చి యుపన్యసించి జీవునిం బ్రబోధించి భక్తింగూర్చి చాటిచెప్పె—

సీ॥ మందారమకరంద మాధుర్యమునఁదేలు
మధుపంబువోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁదూఁగు
రాయంచ చనునే? తరంగిణులకు
లలిత రసాల పల్లవఖాదియై సొక్కు
కోయిల చేరునే? కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు

సంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృతపాన విశేష మత్త
చిత్త మేరీతి నితరులఁ జేరనేర్చు.

... ... ... ...

సీ॥ కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే
పవన గుంభిత చర్మభస్త్రి గాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమ ధ్వనితోడి ఢక్క గాక
హరి పూజనములేని హస్తంబు హస్తమే
తరుశాఖ నిర్మితదర్వి గాక
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే
తనుకుడ్యజాల రంధ్రములు గాక
చక్రి చింతలేని జన్మంబు జన్మమే
తరళసలిల బుద్బుదంబు గాక
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడి పశువు గాక.

— భాగవతము

అనియుపన్యసించి వారల నంపి జీవన్ముక్తుఁడై కొంతకాలముగడపి

శా. బాలత్వంబునఁ గొన్నినాళ్లు పిదపన్ భామా కుచాలింగనా
లోలాభ్యున్నతిఁ గొన్నినాళ్లు మఱి యిల్లున్ముంగిలిం గొన్నినా
ళ్లీలీల న్విహరించితిన్ సుఖఫలం బిం దేమియున్ లేదుగా
హాళి న్నీపదసేవఁ జేసెదను రామా! యార్త రక్షామణీ?

అని వేఁడుచు వార్ధక మిప్పుడిప్పుడ యడుగు వెట్టుచున్నది.
సర్వభారము రామచంద్రుని కర్పించిన నాకేమి భయము ?

అనుచు ద్వంద్వాతీతుండై అహంకార మమకారముల వర్జించి యరిషడ్వర్గముల నిర్జించి యీషణాత్రయము బరిమార్చి నిర్మలాంతఃకరణమున రామ పదమ్ములం జేర్చి దృఢవైరాగ్యముం బూని తదేక చిత్తుండై యుండ నెట్టయెదుట దివ్యప్రభా సంతానమ్మగు విమానమ్ము గోచరింప సంతుష్టాంతరంగుండై నమస్కరించి యనవరతముఁ దన్ను శుశ్రూషాదుల సేవించిన యర్ధాంగినిం గూడ కైవల్యమునకుం గొంపోవ నుంకించి పిలిచిన నా నిర్భాగ్యురాలు "ఇదిగో వచ్చుచు నుంటి నని పని పాంతము చేసి యించుక తడవునకు వచ్చెనఁట." ఇంతలో దాసు 'నీకర్మము పొమ్ము.' అని రామదాసుగారు విమాన మెక్కి భక్తులు నోళ్లు దెఱచికొని చూచుచుండ నగోచరుండై చనియె.

ఇట్లు మన భగవద్భక్తుండు రమారమి యేఁబది యేండ్లు జీవించి చనిన వెనుక భార్య వచ్చి వగచి శ్రీ రామాలయ ముఖ మంటపమ్మున నిరశన వ్రతమ్మునఁ జచ్చెదనని పడియుండ "బిడ్డా! నీకును బరమపదం బిచ్చెద. నీ సుతుండు మదాలయ ధర్మకార్యము నిర్వహించు సామర్థ్యము పొందువఱకు మత్తులసీ వన కైంకర్యముం బూనియుండుము." అను నశరీర వాక్కులు కర్ణగోచరంబులు కాఁగా నామె యట్ల యుండి తుదకు ముక్తిం బొందెను.

## అవశిష్టము.

భక్తవతంసులారా! గ్రంథము ముగిసినది. దీనిని బఠించుట వలన మీ మదులఁ బాదుకొన్న మోదమునో ఖేదమునో

భక్తితో విరక్తితో యించుక సంచలింపఁ జేయవలసియున్నది. క్షమింపుఁడు.

రామదాసు పరమభాగవతోత్తముఁడు. సందియము లేదు. భగవత్సాక్షాత్కారమైన నగును. కాలేదని చెప్పుటకు మన మెవ్వరము ?

ఆధునికచరిత్ర శోధకు లిట్లనెదరు.

"రామలక్ష్మణులు మాఱువేసములతో వచ్చుట యేమి ? ధనము చెల్లించుట యేమి ? ఇదియంతయు భక్తులకల్పన. దీని నెంతమాత్రము నమ్మరాదు. ఒకవేళ రామదాసునందలి భక్తి విశ్వాసముల వలన నెవఁడేని గుణవంతుఁడగు ధనవంతుఁడు ధనము చెల్లించి దాసును విడిపించెనన్న నమ్మిన నమ్మవచ్చును. గాని భగవంతుఁడువచ్చి ధనము చెల్లించి విడిపించెనన్న మాత్రము విశ్వసింపరాదు. అంత భక్తిగల ధనవంతుఁడు 12 వత్సరములు దాసు బాధపడుచుండ నేమిచేయుచుండెను? కనుక నిదియు నమ్మదగనిదే కాఁక జెఱయుందే గోపన్న యసువులం బాసి యుండును." అని.

అట్లైన భద్రాద్రి కోదండరామునికి నేటివఱకుఁ గైంకర్యము లెట్లుజరుగుచున్నవను ప్రశ్నకు నుత్తరము కావలయును. భద్రాచలమందుఁ గోవెలలోని శాసనము చూడుఁడు.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౫౭౪ అగు నేటి (క్రీ 1652) వర్తమాన వ్యావహారిక చాంద్రమాన నందన నామ సం॥ చైత్రశు ౯ భానువారం శ్రీభద్రా

చల సీతారామచంద్ర మహాప్రభువారి సన్నిధిని శ్రీరామ దాసుగారు శ్రీతానీషాగారి యనుమతి వెంబడిని జరిగించిన దేవబ్రాహ్మణ వృత్తులు, శ్రీవారిసన్నిధిని జరిగే వుత్సవ ప్రక రణములు వ్రాసియున్న శాసనం. ధంసా ప్రపంచములో శ్రీవారు పోలవరంవలన వేంచేసినప్పుడు ఒక దుర్మార్గుడు శాసనం చెక్కి వేసినందున సర్వజనులకు దెలిసి సంతోషించే టందుకు లేకపోగా ఆదుర్మార్గుడు పుత్రమిత్రకళత్రాదుల తోటి నశించిపోయినాడు. తదనంతరము శాలివాహన శకవర్షం బులు అగునేటి ౧౭౫౪ (క్రీ 1832) నందననామ సం॥ చైత్ర శు ౯ ఇందువారం భద్రగిరి వరదరామదాసు అనే రామ దాసు వంశమున జన్మించిన భక్తుడు......................... అదివఱకు దుర్మార్గులు ప్రపంచపరిపాలన చేయుటచేతను దేవబ్రాహ్మణవృత్తులు నిరాటంకముగా జరుగుట లేనందున .........హసనాబాదు పరగణాలోవుండే దేవబ్రాహ్మణ వృత్తులు అగ్రహారములు వినుర్మించి సర్వదుంబాలా జరుగ గలందులకు యేర్పాటుచేసిన వివరములు.........."

దీనివలన గోపన్న మాన్యముల నేర్పాటు చేసినట్లును వరద రామదాసునకుం బూర్వమవిక్రమముగా జరుగుచుండ నట్లును దేలుచున్నది. వరదరామదాసు లక్ష్మీనృసింహదాసు గారలు వచ్చిజరిపించుచుండి రది యట్లుండుఁగాక.

"తానీషా యనుమతి వెంబడి జరిగించిన..." అని యుంటచే దాసు కారాగార విముక్తుఁడైన పిదప వచ్చి యీ శాసనము

వేయించి యట్లు జరుపుచుండెనా ? లేక చెఱఁ బడకపూర్వమే వ్రాయించెనా? శాసనము పుట్టినది 1652. తానీషా రాజ్యమునకు వచ్చినది 1658. అని కీ. శే. కే. వి. లక్ష్మణరావు పంతులుగారు. రాజ్యమునకు రాకపూర్వమే తానీషా యనుమతి యేమిటి? ఇందేదేఁ దప్పుగలదు. లేక వరద రామదాసు తన కాలమునాటి "నందన చైత్ర శు ౯" కి సరిగా నుంటకు రామదాసు శాసనమును నందన చైత్ర శు ౯ వచ్చునట్లు మార్చెనా ? లేక నానుడినిబట్టి శాసన మంతయు వరద రామదాసే వ్రాయించెనా ? విచారింపవలయును. "పున రుద్ధారంచేసి" అను పదము లుంటచేతను, శాసనాంతమున రామదాసు వ్రాసిన పద్యమని యుంటచేతను శాసనము రామ దాసే చెక్కించియుండును. దాని నెవఁడో తురక చెక్కించి వేయుటచే సత్యము మఱుగుపడినదని తలంతము. అట్లైన నెప్పుడు శాసనమును దాసు వేయించెను?

లోకములో దేవాలయాదుల నిర్మాణముచేసి యప్పుడే శాస నము చెక్కించుట కలదు. కాన రామదాసు భగవంతునిపై భారమువేసి యాలయము కట్టించినపుడే తాను తాలూకా కధికారి యగుటచే దేవాలయాదులకు మాన్యము సయి తము నేర్పఱచి యిది యంతయుఁ "దానీషాగారి యనుమతి వెంబడిని జరిగించిన" దని వ్రాయించివచో నిది ధర్మకార్య మగుటచేతను, దనపేర జరుపుటచేతను, మసీదులను, దేవా లయములను సమముగాఁ జూచుచుండువాఁ డగుటచేతను, నేను వేఁడుకొన్నఁ దానీషాగా రెట్టకేల కియ్యకొనకపోదురా

యనియు, నొకవేళ చంపించినచోఁ జంపింపనిమ్ము. భగవత్కా ర్యమునకై ప్రాణముల నర్పించిన సుకృతమేని లభించుననియు సాహసించి శాసనము వేయించి యుండుసని యూహింప వలయును.

దానే చెఱఁ బడినపుడు తన్నిర్ణయ మెట్లు జరుగుచుండెనన— హిందూ మహమ్మదీయులఁ దుల్య దృష్టి నరయు సార్థక నాముఁడగు తానీషా జరిగిన దేదో జరిగినది. స్వాముల మాన్యముల నేల హరించి పాప మొడిఁ గట్టుకొనవలయునని తలంచి తూష్ణీంభావము వహించి కాని, లేక వాని నంగీకరించి కాని, యుండునని యెంచవలయును. ఆ శాసన ప్రకారము జరుగుచువచ్చి వరదరామదాసునకుఁ బూర్వము కొంతకాల మునుండి బ్రాహ్మణులే మాన్యముల ననుభవించుచు స్వామి కైంకర్యాదుల సక్రమముగా జరుపకుండిరి. అక్కడతన మఱల వానిఁ బునరుద్ధరింప నవసరము కల్గి వరదరామదాస ట్లాచ రించెను. *

సరియే, గోపన్న కారాగార విముక్తుఁడయ్యెనా ? కాలేదా ? మండలచారిత్రములో "సీ రామదాసు కారాబద్ధుఁడై యా కారాగారముననే మృతిఁబొందినట్లుగూడఁ జెప్పఁబడియున్నది" (పెద్ద-సం-వి-౭౫ పేజి) అని శ్రీబ్రహ్మయ్యశాస్త్రిగారు వ్రాసిరి.

* (నిజమునకుఁ దూరము లక్ష్మీనృసింహదాసుగారు తహశీల్దారుగా నుండి యన్నిపనుల నిర్వర్తించినది. అయిన నతండు భక్తి జ్ఞాన వైరాగ్యములు కలవాఁడై, శిష్య వాత్సల్యముచే వ్యవహారము లన్నియు నాగండ్ల వరదరాము దాసుగారి పేర జరిపెను. వివరముగా నృసింహదాసు చరిత్రమున వ్రాసితిని.)

"ఉ-వే- శ్రీవిద్యారణ్యపంచానన విక్కిరాల రామచంద్రా చార్యులవారును దా మాతాతలను జదివించి వింటిమని సెల విచ్చు చున్నారు." (రామదాసుచరిత్ర-వేంకటేశ్వర) చరిత్ర పరిశోధకులకుఁ బ్రబలమైన యాధారము లభించినది. మన మేమిచేయుదము. ఈజిల్లామాన్యులు వ్రాఁతను కాదనఁ గలమా ? మన మతాచారధర్మముల విశ్వసింపని యే యాంగ్లేయుఁడో యే తురుష్కుఁడో పాక్షికదృష్టివ్రాసిపెట్టినదే మనకు భిక్ష.

అగుఁగాక. రామదాసా ! భక్తాగ్రేసరా ! మహా పుణ్యశాలీ! నమస్కారము. నమస్కారము. నీవు చెఱలోనే మృతి చెందితివా? ధన్యుఁడవు. ధన్యుఁడవు. నీజన్మము సార్థకమైనది. నీతలంపు నెఱవేఱినది. నీ భక్తి యచంచలము. నీ త్యాగము నిరుపమానము. నీధైర్యము వర్ణనీయము. నీ జీవితము నిత్య స్మరణీయము- తండ్రీ! ఇట్టి త్యాగమూర్తివి కనుక నేగదయ్యా మా యాంధ్రుల ప్రతి రక్తకణమునందును నీవే ప్రతిధ్వనించు చున్నాఁడవు. నీవు కారాగార విముక్తుఁడవైన దానికన్న నందే శరీరముం దొఱఁగుటచే నెనలేని కీర్తి గాంచితివి. ఆ త్యాగమహిమను నెఱుఁగని మావారు విముక్తిం గల్పించి నీ కీర్తిభర్మమున కొకవన్నెఁ దగ్గించిరి. శ్రీరామునకు భారము తగ్గించిరి. తానీషా యవగుణమును దగ్గించిరి.

భక్తాగ్రేసరా ! చెఱలోనా నీమృతి ! భళి. భళి. ఎంత పుణ్యాత్ముఁడవయ్యా ! ఎంత త్రికరణశుద్ధిగలవాఁడవయ్యా !

దొకటి చేయునదొకటి కాని నిజమైన భక్తుఁడవు నీవేనయ్యా! సర్వభారము రామునిపై వైచి రానున్నయాపద నెఱిఁగి యెఱిఁగి రామ సేవఁ జేసితివా? మృత్యుదేవతాకరాళవక్త్ర గహ్వరమునఁ జెయి వెట్టితివా? మంచిది! మంచిది! శరీరము నశ్వరమైనది. కీర్తి శాశ్వతమైనది. దృష్టాంతము చూపించితివి.

గోపన్నా! చెఱసాలయా! నీ వధ్యస్థానము. కానిమ్ము. నీవు స్వోదరపరాయణుఁడవైనచో నీవట్లు చావవలసినదే యని పల్కెదము. నేఁడట్లు పలుకము. నిన్నగ్గించెదము. నీ ధైర్యమును గొండాడెదము. నీ బుద్ధిని బ్రశంసించెదము. నీ సాహసము నభివర్ణించెదము. నీవు దేవుని కొఱకుఁగా కాయమును ద్యజించినది.

రామదాసా! కారయా నీకు వల్లకాఁడు-అయిన నేమి? దేవతులకుఁ గాయ మిచ్చిన దధీచి నీ కాదరమున నెదురు వచ్చి స్వాగత మిచ్చుచున్నాఁడు. సజీవు లగుట నాత్మ మాంస మిచ్చిన శిబిగాని జీమూతవాహనుఁడుగాని కర్ణుఁడుగాని నీ కెన రారు. ఇం కేమి కావలయును? నీవు ధన్యుఁడవు. నిన్నుగన్న మా యాంధ్రమాత ధన్య. సెలవు.

---

తెనాలి భారతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడెను. 1935.